## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034364

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# చిన్ని కథలు


## వేదగిరి రాంబాబు





ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

హైదరాబాద్ - 4

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషి చేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవి రెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికీ, వినోదానికీ రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి.

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలల్ను, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తునాము.

**శారదా అశోకవర్ధన్**
సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి
జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

# విషయ సూచిక

# అపాయంలో ఉపాయం

ఆహార పదార్థాల కోసం అలా అలా తిరిగి తన కన్నంలోకి దూరిన చిట్టెలుకని గమనించింది ఓ గండు పిల్లి. దాన్ని చటుక్కున చప్పరిస్తే ఎంత బావుంటుందో కదా అని ఆలోచించింది.

అందుకే ఆ కలుగు పక్కనే మాటువేసి ఆలోచించసాగింది. ఓ ఆలోచన వచ్చింది.

"ఎలుక అల్లుడూ.....ఎలుక అల్లుడూ...1" కన్నంలోకి చూస్తూ పిలిచింది.

"ఏమిటి పిల్లి మావా ?" లోపలి నుంచే అడిగింది ఎలుక.

"ఇలా తూర్పు దిక్కుకు కొద్దిగా ముందుకు పోతే వేరు శనగ చేను ఉంది. అక్కడ కాయలు ఎంత బావున్నాయనుకున్నావ్! రేపు ఉదయం అయిదు గంటలకి నువ్వు కూడా వస్తానంటే ఇద్దరం కలసి వెళ్దాం" అందిొలటుపిల్లి.



ఆ వంకన తనని పిలిచి స్వాహా చేద్దామన్న దాని ఆలోచనని పసిగట్టేసింది ఎలుక. కాని బయట పడకుండా "అలాగే" అంది.

మరునాడు ఉదయం అయిదు గంటలకి పిల్లి వచ్చి ఎలుకని పిలిచింది."నేను నాలుగు గంటలకే వెళ్ళి సుష్టుగా తిని వచ్చాను." అని జవాబిచ్చింది ఎలుక.

గండుపిల్లి తన కోపాన్ని గొంతులోనే దిగమింగుకుంది. "సరే మంచిది. మరో మంచి పంటని ఇవాళ వస్తూ చూశాను. ఆ పొలం వేపు రేపు ఉదయం నాలుగు గంటలకి వెళ్దామా" అంది.

"అలాగే" అంది ఎలుక.

మరునాడు కూడా పిల్లి వచ్చే సరికే ఎలుక వెళ్ళి వచ్చేసింది. 'కాని ఈ పిల్లి తలనొప్పిని వదిలించుకోవడం ఎలా ?' అని ఆలోచించసాగింది.

రోజూ గండుపిల్లి కన్నా ముందే వెళ్ళి వేరుశనగ చేనుని కొరికి రాసాగింది ఎలుక.

తన పంటని నాశనం చేస్తున్న దెవరో తెలుసుకుందామని ఆ రోజు రైతు చెట్టు చాటున దాగి గమనించసాగాడు.

కావాలనే ఆ రోజు ఎలుక ఆలస్యం చేసింది. ముందు ఎలుక, వెనుక గండుపిల్లి పొలం వేపు బయల్దేరాయి.

తీరా వేరుశనగ పొలం దగ్గరికి వెళ్ళగానే ఓ కన్నంలోకి దూరి మాయమైంది ఎలుక. దాని కోసం వెదుకుతూ అటూ ఇటూ చూస్తున్న పిల్లిని గమనించాడు రైతు.'ఇదే తన పొలాన్ని పాడు చేస్తోందని' అతను అనుకున్నాడు.

అంతే! అతని చేతిలో ఉన్న బడితెని పిల్లి మీదకి విసిరేశాడు. దాని వాతబడి పిల్లి చచ్చి పోయింది. నిశ్చితంగా ఎలుక తన కలుగుకు వెళ్ళి పోయింది. ఉపాయంతో ఆలోచించి ఎంతటి అపాయం నుంచైనా బయట పడవచ్చు!

***

# పెద్దల మాట

చిన్న కుందేళ్ళు నాలుగింటికీ బాగా పరుగెత్తడం కూడా వచ్చింది. అందుకని ఆ రోజు "అమ్మా! మేమలా వెళ్ళివస్తాం" అని అడిగాయి తల్లి కుందేలుని.

"వెళ్ళి రండమ్మా .......కానీ అదుగో కనిపిస్తోందే ఆ ఇంటి వైపు మాత్రం వెళ్ళకండి. అక్కడ ఉన్న మనుషులు చాలా దుర్మార్గులు. ఒకసారి ఇలానే మీ నాన్న అటు వెళ్తే బంధించేశారు. ఇంతవరకూ విడిచిపెట్ట లేదు .... " అంది కన్నీరు కారుస్తూ.

"అలాగేనమ్మా అటు మాత్రం వెళ్ళం" అంటూ మాట ఇచ్చాయి నాలుగు కుందేలు పిల్లలు.

పెద్ద పిల్లలు మూడు ఆ మాట మీదే నిలబడి అటువైపు వెళ్ళ లేదు. నాల్గవది మాత్రం పంతం కొద్దీ ఆ ఇంటి వైపే వెళ్ళి నెమ్మదిగా ఇంటి ముందు తోటలోకి జొరబడింది. లోపల రకరకాల మొక్క లున్నాయి. మధ్యగా ఇల్లుంది.



మొక్కలకి ఉన్న చిన్న చిన్న కాయలని తింటూ ముందుకు బయల్దేరింది చిట్టి కుందేలు. కొద్దిదూరం వెళ్ళేసరికి ఏదో శబ్దం వినిపించసాగింది. తలెత్తి చూసింది. కొద్ది దూరంలో మొక్కలకి పాదులు చేస్తూ ఓ మనిషి కనిపించాడు. భయంతో ఒక్కసారి వెనక్కి గెంతింది చిట్టి కుందేలు.

శబ్దం రావడంతో తల త్తి చూశాడు ఆ మనిషి. చిట్టికుందేలు అతని కంటపడింది. చటుక్కున లేచి దాని వెంటపడ్డాడు.

భయంతో చిట్టికుందేలు పరుగెత్తసాగింది. ఎంత దూరం పరుగెత్తినా ఇందాక తను లోపలికి వచ్చిన దారి తెలీక ఎటెటో పరుగెత్తసాగింది. అతను దాన్ని వెంటాడుతున్నాడు.

పరుగెత్తి పరుగెత్తి పాత సామాన్ల గదిలోకి దూకింది చిట్టి కుందేలు. దాన్ని అతను గమనించనే గమనించాడు. నెమ్మదిగా ఒక్కొక్క సామానుని కదిలించి కుందేలు కోసం చూడసాగాడు.

అతను దగ్గరకు వస్తున్న కొద్దీ చిట్టికుందేలులో భయం పెరిగిపోసాగింది. ఇంతలో అతను చిట్టి కుందేలుకి కొద్దిగా అవతల ఉన్న చెక్కని కదిలించాడు.

అంతే! చటుక్కున ఓ ఎలుక దాని చాటునుంచి ఇవతలికి వచ్చి, పక్కనున్న కిటికీలోంచి బయటికి దూకింది.

చిట్టి కుందేలు చిన్ని బుర్రలో మెరుపు మెరిసింది. తనూ ఎలుక వెనుకే కిటికీలోంచి బయటికి దూకింది. దాని వెనుకే పరుగెత్త సాగింది.

ఎలుక భయంతో తోట దాటి బయటికి వచ్చేసింది. కుందేలు కూడా దాని వెనుకే బయటికి వచ్చింది

దూరంగా తమవేపే వస్తూ ఆ మనిషి కనిపించాడు. చిట్టి కుందేలు తమ ఇంటి వేపు వేగంగా పరిగెత్తసాగింది. ఇంటికి చేరుకున్న తరువాత కూడా ఎప్పటికోగాని గుండె దడ తగ్గలేదు.

తల్లి అటువేపు వెళ్ళవద్దని ఎందుకు చెప్పిందో దానికి అప్పుడు అర్థమైంది. ఇకముందు ఎప్పుడూ పెద్దల మాటని జవదాటకూడదని ఒట్టేసుకుంది చిట్టి కుందేలు.

# పాపం తోడేలు

మూడు మేకలు ఒకచోట నివసిస్తూ ఉండేవి. ఆ మూడు వంతెనకి అవతల ఉన్న గుట్టదగ్గర రకరకాల ఆకులను తిని జీవించసాగాయి.

అటుగా వచ్చిన ఓ తోడేలు కన్ను వాటి మీద పడింది. కాపువేసి పట్టుకోవడానికి వంతెన కింద నక్కింది.

ఇంతలో ఓ మేక అటుగా రాసాగింది.

"రా .... రా .... నీ కోసమే చూస్తున్నాను, నిన్ను సుష్ఠుగా భోంచేస్తాను " అంది చటుక్కున ఇవతలి తోడేలు.

మేక భయపడిపోయింది.

"నన్ను తింటే నీ ఆకలేమి తీరుతుంది. నేను చాలా చిన్న దానిని. వెనక నాకన్నా పెద్ద మేక వస్తోంది. దాన్ని తింటే నీ ఆకలి తీరుతుంది. ఈ లోపల నేను వెళ్ళి ఆకులు అలములు తిని వస్తాను " అంది మేక



సరేనంది తోడేలు.

రెండో మేకని కూడా అడ్డగించింది తోడేలు.

" నాకన్నా పెద్ద మేక వెనుక వస్తోంది " అంటూ అదీ తప్పించుకుంది.

ఇవి రెండూ వెళ్ళి సు ష్టుగా ఆకులలములు తిని వెనక్కి వచ్చే సరికి పెద్ద మేక వస్తూ కనిపించింది.

తోడేలు దానికి ఎదురువెళ్ళ బోయింది.

" నేనెంతగా బలిసున్నానో చూశావు గదా1 నా కొమ్ములతో నీ కళ్ళు పీకివేయ గలను. గట్టిగా ఒక్కసారి 'ఢీ' కొట్టానంటె పచ్చడై పోతావ్!" అంటూ తోడేలు మీదకి ఉరికింది ఆ పెద్ద మేక.

తోడేలు కొద్దిగా జంకింది.

ఇంతలో వెనకనించి వచ్చిన మేకలు రెండూ దాన్ని బలంగా ముందుకు తోశాయి. తోడేలు వంతెన కింద ప్రవహిస్తున్న నీటిలో పడి కొట్టుకుపోయింది.

చూశారా! ఐకమత్యంతో ఉంటే ఎంత పెద్ద శత్రువునైనా ఎదుర్కోవచ్చు!!

***

# కప్ప కథ

కప్పలు ఒకప్పుడు మధురంగా పాడేవట. ఆ తర్వాత వాటి గొంతు పోయింది. దీనిగురించి పెద్దలు ఒక కథ చెబుతారు.

ఒకానొకప్పుడు ఓ కప్ప, దాని మిత్రుడు చిట్టెలుక కలసి వెళుతున్నాయి. మంచి వంటకం సువాసన వాటికి తగిలింది. దగ్గరలోనే మాంసం ఉడుకుతున్న పొయ్యి కనిపించింది. సన్నటి మంట మీద కుండలో మాంసం ఉడుకుతున్నది. దగ్గరలో ఎవరూ లేరు.

"ఎవరో మాంసం వండుతున్నారు." ముక్కుపుటాలు ఎగరేసి కప్ప అన్నది." ఆ కుండ యజమాని పరిసరాలలో లేడు. కాబట్టి మాంసాన్ని తిందామని ఆ రెండు నిశ్చయించుకున్నాయి. వంతుల వారిగా తిందామని ఓ ఉపాయం ఆలోచించాయి. మొదట ఒకరు తింటుంటే ఇంకొకరు కాపలా కాయాలి. మాంసం యజమాని వస్తూంటే అరవాలి.

చిట్టెలుక తనకు బాగా ఆకలవుతుందని చెప్పి మొదట తినసాగింది. తరువాత కప్ప తినడం మొదలు పెట్టింది. చిన్న చిన్న ముక్కలు



వదలి నోటి నిండా ఉండే పెద్ద మాంసం ముక్కను నోట్లో పెట్టుకుంది కప్ప. ఇంతలో చిట్టెలుక అరిచింది, అదిగో యజమాని వస్తున్నాడని!

యజమాని అంతదూరం నుంచే కప్పను బెదిరిస్తూ అరిచాడు. అసలే భయంతో బిక్క చచ్చి పోయిన కప్పకు వేడి మాంసం ముక్క గొంతులో దిగబడింది. దగ్గరలోనే ఒక ప్రదేశంలో దాక్కుంది. చిట్టెలుక ఎప్పుడో పారిపోయింది.

ఆ రోజు సాయంకాలం కప్ప పాడలేదు. చుట్టు పక్కల జంతువులన్నీ కప్పా! కప్పా! నీ మధురమైన గొంతుతో ఈ పూట ఎందుకు పాడటం లేదు, అని అడిగాయి. కప్ప "సరే ప్రయత్నిస్తా"నని నోరు తెరిచి పాడబోయింది.

" బెకబెక బెకబెక " చప్పుడు తప్ప మరో ధ్వని రావడం లేదు. మాంసం వేడికి దాని గొంతు కాలిపోయింది. అప్పటి నుంచి కప్పలకు మధురమైన గొంతు లేదు.

అత్యాశ, ఆత్రం ఎప్పటికీ చేటే!

***

# సహాయం

చాలా కాలంగా అక్కడ వర్షాలు పడడంలేదు. దాంతో ఏనుగులకి తాగడానికి నీళ్ళు కూడా కరువయ్యాయి.

ఈ నీటి కరువు నుండి తమని కాపాడమని ఏనుగులన్నీ వెళ్ళి తమ రాజుకి మొర పెట్టుకున్నాయి.

ఆ అడవంతా తిరిగి ఓ చోట చిన్న సరస్సు కనిపిస్తే ఆ స్థలాన్ని మిగతా ఏనుగులకు చెప్పింది రాజు ఏనుగు.

ఆ రోజు నుంచి ఏనుగులన్నీ నీటిని తాగడానికి ఆ సరస్సు వైపు వెళ్ళ సాగాయి.

ఇది ఆ సరస్సు చుట్టూ ఉన్న గడ్డిలో తిరుగాడుతున్న కుందేళ్ళకి గడ్డు సమస్య అయింది. రోజూ ఏనుగుల కాళ్ళ కింద పడి ఎన్నో కుందేళ్ళు చనిపోసాగాయి.

ఆ బాధను వదిలించుకోవడం ఎలాగో వాటికి అర్థం కాలేదు.

ఓ ముసలి కుందేలుకి చక్కటి ఆలోచన వచ్చింది.



మర్నాడు అది సరస్సు వైపు వచ్చే ఏనుగులకి ఎదురువెళ్ళింది. "ఏనుగులారా! ఆగండి.... ఆగండి మీకో మాట చెప్పమని నన్ను చంద్ర దేవత పంపించింది" అంది.

ఏనుగులన్నీ ఆగాయి.

"ఏమని చెప్పమంది"? అడిగాయి "సరస్సు చంద్ర దేవతదే! ఆవిడ ఆజ్ఞలేకుండా సరస్సుకి రావడం మొదటి తప్పు. ఇక్కడ తిరిగే కుందేళ్ళని మీకాళ్ళ కింద వేసి నలిపివేయడం రెండవ తప్పు" అంది ముసలికుందేలు.

" అరే! ఈ విషయం మాకు తెలియదే!" అన్నాయి ఏనుగులు.

"నా మాటలు నమ్మకపోతే నాతో రండి చంద్ర దేవత ఎంత కోపంగా ఉందో మీకు చూపిస్తాను," అంటూ ఏనుగుల్ని సరస్సు దగ్గరకు తీసుకెళ్ళింది కుందేలు.

సరస్సులో నీరు కదులుతోంది. ఆ కదులుతున్న నీటిలో పైనున్న చంద్రుని యొక్క బింబం కదుల్తూ కనిపించింది,

"చూడండి చంద్ర దేవత కోపంతో ఎలా ఊగిపోతోందో" అంది కుందేలు.

కదులుతున్న చంద్రబింబం కోపంతో ఊగిపోతున్న చంద్ర దేవతలాగానే అనిపించింది వాటికి.

"చంద్ర దేవతా! మమ్మల్ని క్షమించు. మళ్ళీ ఈ సరస్సు వైపు రాము..." అంటూ ఏనుగులన్నీ వెనక్కి తిరిగాయి.

ఆనందంతో నిట్టూర్చింది ముసలి కుందేలు - తమ కష్టాలు తీరిపోయినందుకు!

కష్టమొస్తే కృంగి పోకూడదు. ఎలా తొలగించుకోవాలని ఆలోచించాలి

***

# బహుమతి

పూర్వం రాముడు అనే యువకుడు లోహంతో గంటలని చేసి వాటిని అమ్ముకొని జీవిస్తూ ఉండేవాడు.

ఓ రోజు అతను ఒక గంటని తయారు చేసి పక్క గ్రామంలో ఉన్న పాఠశాలలో ఇవ్వడానికి బయలు దేరాడు. ఆ గ్రామానికి పోవాలంటే ఓ చిన్న పాటి అడవి గుండా పోవాలి.

అతను అడవి గుండా వెళ్తున్నపుడు ఓ సింహం అతని మీద పడి చంపేసింది. గంట మాత్రం అక్కడే ఉండి పోయింది.

కొంత సేపయిన తర్వాత కొన్ని కోతులు అటుగావచ్చాయి. గంట వాటికి వింతగా అనిపించింది. దాన్ని మోగిస్తే వచ్చే శబ్దానికి అవి ఆనందంగా గంతులు వేశాయి.

ఓ ముసలి కోతి మిగతా కోతుల సాయంతో ఆ గంటని ఒక చెట్టుకి వేళ్ళాడ దీసింది. కోతులు వాటికి ఇష్టమయినప్పుడు గంటని మ్రోగించి ఆనందించ సాగాయి.



కోతులకి చెలగాటం మనుషులకి ప్రాణసంకటంగా తయారు అయింది పరిస్థితి. అర్థరాత్రి పూట అడవిలోనించి గంటల మోత వినిపిస్తుండడంతో పక్క నున్న గ్రామస్తులు భయంతో కంపించి పోసాగారు. బహుశ అది ఏ దెయ్యం పనో అని అనుకోసాగారు.

ఆ అడవిలోకి తమ ఆవుల్ని గేదెల్ని మేపడానికి పంపడం కూడా మానుకున్నారు, మనుషుల సంగతయితే సరేసరి... అటువైపు చూడడం కూడా మానుకున్నారు. కొంత మంది అయితే ఊళ్ళోకి కూడా ఆ దెయ్యాలు వస్తాయోమో అనే భయంతో ఆ ఊరే ఖాళీ చేసి వెళ్ళిపోయారు.

గ్రామం గ్రామ మంతా దెయ్యం భయంతో వణికిపోసాగింది. ఆ దెయ్యం బెడద ఎలా వదలించుకోవాలో ఎవ్వరికి అర్థంకాలేదు.

దెయ్యాన్ని వెళ్ళగొట్టిన వారికి బహుమతి ఇస్తామంటూ ప్రకటించారు గ్రామపెద్దలు.

ఆ ఊళ్ళోనే ఉంటున్న ఓ ముసలమ్మకి ఈ దెయ్యం గొడవంతా ఎవరో వెనక ఉండి చేయిస్తున్న నాటకమని అనుమానం! అందుకని ఆమె దెయ్యం సంగతి కనుక్కోవడానికి ముందుకు వచ్చింది.

ఆ పని చెయ్యగలదని ఆమెని గ్రామపెద్దలు నమ్మక పోయినా "చూద్దాం" అనుకున్నారు.

ముసలమ్మ మర్నాడు గంటలు వినిపించే దిక్కుకి అడవివైపు బయలు దేరింది.

ఆమె అనుమానం నిజమయింది. ఒక చోట చెట్టు మీదఎక్కి గంటని మోగిస్తున్న కోతిని చూసింది.

వెంటనే ఆమె తన చేతిలో ఉన్న బఠాణీలను దూరంగా విసిరేసింది. వాటిని ఏరుకుని తింటానికి కోతులన్నీ అటు పరుగెత్తాయి.

ముసలమ్మ చెట్టును ఎక్కి ఆ గంటని ఊడదీసింది. పక్కనే ఉన్న సరస్సులో దాన్ని పడేసింది.

ఆ గంట నీళ్ళలో పూర్తిగా మునిగి పోయే వరకు ఆమె అక్కడ ఉండి అప్పుడు ఊళ్ళోకి తిరిగొచ్చింది.

"దెయ్యాన్ని దూరంగా పారిపోయేటట్లు వెళ్ళగొట్టినాను" అని ఊళ్ళో వాళ్ళకు చెప్పింది.

ముసలమ్మ అడవిలోకి వెళ్ళివచ్చిన తరువాత మళ్ళీ గంటలు వినిపించక పోవడంతో అందరూ ఆమె మాటలని నమ్మేశారు. ఆమెకి ఎన్నెన్నో బహుమతులను ఇచ్చారు. వాటితో తన చివరి జీవితాన్ని ఎంతో ఆనందంగా గడిపింది.

భయపడకుండా ముందుకి అడుగువేస్తేనే ఏ పనినైనా చేయగలం!

***

# ఎలుగు విందు

మూడు ఎలుగు బంట్లు కలిసి ఒక చోట జీవిస్తున్నాయి. వాటిలో ఒకటి చాలా పెద్దది, రెండోది మధ్య రకంది, మూడోది చాలా చిన్నది! మూడు అన్ని సౌకర్యాలూ కల్పించుకుని ఓ చక్కటి ఇంట్లో ఉంటున్నాయి. అక్కడ ఎవరి కుర్చీలు, పక్కలు వారివే!

ఒక రోజున అవి విందు కోసం ఘుమఘుమలాడే పాయసాన్ని తయారు చేసుకున్నాయి. వేడిగా ఉండడంతో మూడు పాత్రలలోను పోసుకొని, భోజనం బల్ల మీద చల్లారడానికి పెట్టి, అలా బయటికి వెళ్ళివద్దామని బయలు దేరాయి.

ఇంతలో ఓ పాప ఆడుకుంటూ అటుగా వచ్చింది. ఆ ఇంట్లోంచి వస్తున్న వాసనలకి ఆమె నోరూరింది.

ఆ ఇంట్లో ఎవరు ఉంటున్నారో చూద్దామని కిటికి దగ్గరికి వచ్చి లోపలికి తొంగిచూసింది. భోజనపు బల్ల మీద పాయసంతో పాత్రలు కనిపిస్తున్నాయి. కాని ఎవరూ ఉన్నట్లు కనిపించడం లేదు.



నెమ్మదిగా లోపలికి వచ్చింది. పెద్ద పాత్రలో ఉన్న పాయసం వేడిగా అనిపించింది. చిన్న ఎలుగు పాత్రలో ఉన్న పాయాసం చల్లారిపోయి ంది. అందుకని మధ్య పాత్రలో పాయసాన్ని శుభ్రంగా తిన్నది. కూర్చుని తినడానికి కూడా మూడు ఎలుగు బంట్ల కుర్చీలను పరీక్షించి, మధ్య ఎలుగు బంటి కుర్చీ మీదే కూర్చుంది.

తిన్న తర్వాత నిద్రవస్తున్నట్లనిపించి పడక గది వైపు దారి తీసింది. అక్కడ కూడా మూడు పరుపుల్నీ పరీక్షించింది. మధ్య దాని పక్క మీద పడుకోవడమే హాయనిపించింది. పడుకుంది. అంతే! ఠక్కున నిద్ర పట్టేసింది.

బయటికి వెళ్ళిన మూడు ఎలుగు బంట్లు తిరిగి వచ్చాయి. పాయ సాన్ని తిందామని భోజనపు బల్ల దగ్గరికి వెళ్ళే సరికి ఎవరో తమ పాత్రల్ని కదిలించినట్లు వాటికి అనిపించింది.

"నా పాత్రలోని పాయసాన్ని ఎవరో తినేశారు" కంగారుగా అంది మధ్య రకం ఎలుగు.

"అంతే కాదు మా పాత్రల్ని కూడా కదిలించారు"కదిలినపాత్రల్ని గమనిస్తూ అంది పెద్ద ఎలుగు.

"మన కుర్చీలన్నీ కూడా ఎలా కదిలించారో చూడండి" బుంగ మూతి పెట్టి అంది చిన్న ఎలుగు

తాము ఇంట్లో లేనప్పుడు ఎవరొచ్చారో తెలుసుకోవాలని మూడు ఎలుగు బంట్లు వెదకసాగాయి.

ఆఖరికి పడక గదిని చేరుకొన్నాయి.

"మనపరుపుల్నికూడాకదిలించారు" పెద్ద ఎలుగుకి కోపం వచ్చింది.

"నిజమే!" వంత పాడింది చిన్న ఎలుగు.

"నా పక్క మీద ఎవరో పడుకున్ని ఉన్నారు" మధ్య ఎలుగు కీచు గొంతుతో అంది. వాటి మాటలకి పరుపు మీద పడుకున్న పాపకు చటుక్కున మెలుకువ వచ్చింది. కళ్ళు తెరిచి చూసింది.

ఎదురుగా మూడు ఎలుగు బంట్లు!

భయంతో వణికిపోయింది.

ఒకసారి బిక్కుబిక్కు మంటూ చుట్టూ చూసింది. గాలి కోసం తెరిచి ఉన్న కిటికీ కనిపించింది.

పైకిలేచి చటుక్కున ఆ కిటికీలోంచి బయటికి దూకి పరుగు లంకించుకుంది పాప. అంతే! ఆ తర్వాత మళ్ళీ ఎప్పుడూ ఎలుగు బంట్లు ఉండే ఇంటి వైపు పోలేదు ఆ పాప.

క్రొత్త ప్రదేశాలకి వెళ్ళినప్పుడు పరిసరాల్ని జాగ్రత్తగా గమనించి మసలుకోవాలి!

***

# కనువిప్పు

ఒకసారి అడవిలో ఎలుగు బంటు దొరికిన చెట్టు కాయలని తిని చెట్టు కింద విశ్రాంతిగా కూర్చుంది. అప్పుడు దాని ఎదురుగా కొన్ని పావురాలు , కొంగలు, పాల పిట్టలు అందంగా ఎగిరి వెళ్ళాయి బారులు బారులుగా. "ఎంత అందంగా ఉన్నాయి సుమా!" అనుకుంది ఎలుగు బంటి - ఆ తరువాత తెల్లని చర్మంతో, మిల మిలా మెరిసే కళ్ళతో కుందేళ్ళు, అందంగా చక్కగా గెంతే లేళ్ళు కనిపించాయి --- " ఆహా ---- ఎంత అందమైనవీ జంతువులు!" అనుకుంది.

చక్కని పూలచెట్లనీ, పళ్ళ చెట్లనీ చూసింది --- ఇవన్నీ ఇంత అందంగా ఉంటే నేనెందుకు ఇంత నల్లగా, బొచ్చుతో అసహ్యంగా రోతగా పుట్టాను? దేవుడు దుర్మార్గుడు. అందుకే నన్నిలా పుట్టించాడు అనుకుంది.

కొంతసేపటికి దాహం వేసి ఒడ్డున నిలుచుంది. నీళ్ళు తాగబోయి బాధ పడింది. "ఛీ ఏం దేవుడు, నా వొంటి మీద అసహ్యంగా నల్లగా ఇంత నల్లని జుట్టూ చి-ఛీ- జుట్టు లేకుండా ఏనుగు లాగా ఉంచరాదు



నన్ను దేవుడు? కుందేలులా తెల్లగా ఉంచితే ఏం పోయింది? కనీసం సింహానికి ఉన్నట్లుగా ఒక్క తల మీదే జుట్టు ఉంచవచ్చు గదా, జింకలా మచ్చలుండ వచ్చు గదా. దేవుడికి బుద్ధిలేదు. నా ఒక్క దానికి అన్యాయం చేసి ఇంత అసహ్యమైన చర్మం, జుట్టు ఇచ్చాడు" అనుకుంది. బాధతో, కోపంతో నీళ్ళు తాగలేదు. ఆకలేస్తే ఆహారం వెదకలేదు. అలాగే ఆలోచిస్తూ దేవుడిని తిడుతూ కూర్చుంది.

ఇంతలో ఎండా కాలం ముగిసి వర్షాకాలం, ఆ తరువాత చలికాలం భయంకరంగా వచ్చి పడింది. హోరున మంచు, జివ్వుమనే చలి, పక్షులు వెచ్చని గూళ్ళలో నిలిచి పోయాయి. జంతు సంచారం చాలా మటుకు ఆగి పోయింది. ఆ అడవిలో భయంకర చలి గాలికి జంతువులు తల్లడిల్లి పోయాయి. వాటికి ఆహారం దొరకలేదు. అవి తిరగలేక పోయాయి.

కాని ఒక్క ఎలుగు బంటి మాత్రం చలిని లెక్క చేయలేదు. కారణం దాని చర్మం మీది బొచ్చు వలన చలితగలలేదు. హాయిగా తిరిగి ఆహారం సంపాయించుకొంది.

మంచుకి జడిసిన ఒక కుందేలు ఎలుగు బంటితో అంది. "నువ్వే నయం అంత బొచ్చు ఉండబట్టి తిరగ గలుగుతున్నావు. భగవంతుడెంత సౌకర్యం ఇచ్చాడు నీకు" అంది.

అంతే! ఎలుగుబంటుకి కనువిప్పు కలిగింది. దేవుడి దయ ఏమిటో ఎలుగుబంటుకి ఆ రోజే సరిగ్గా అర్థమైంది. అప్పటి నుంచీ అది దైవ దూషణమాని చక్కగా బతికింది.

***

# ఎదురు తిరిగిన మోసం

నక్క జిత్తుల మారి అని గాడిదకి తెల్సు. అయినా దాని మాయ మాటలని నమ్మేసి స్నేహం చెయ్యడం మొదలు పెట్టింది.

ఒకరిని విడిచి మరొకరు సంచరించకూడదని ఇద్దరూ కలిసే తిరగసాగారు.

ఆ రోజు నక్క, గాడిద కలిసి అడవిలో సంచరిస్తుంటే హఠాత్తుగా సింహగర్జన వినిపించింది.

భయంతో పారిపోవాలని వెనక్కి తిరిగిన ఆ రెండు జంతువులకూ తమవంకే చూస్తూ గర్జిస్తున్న సింహాన్ని చూసేసరికి గుండెలు జారిపోయాయి.

నక్క ముందు తేరుకుని "ముందు మనం ఆ సింహంతో నేస్తం చేయకపోతే మన ప్రాణాలు పోతాయి ......" అంటూ ధైర్యంగా సింహం వేపు బయల్దేరింది నక్క.



సింహాన్ని చేరుకోగానే ముందు దాన్ని కాసేపు పొగిడి "ఆ గాడిద బాగా బలిసి ఉంది కాబట్టి దాన్ని తింటేనే మీ ఆకలి చల్లారుతుంది" అంది నెమ్మదిగా.

సింహానికి నక్క ఉపాయం అర్థమైంది. తన ప్రాణాన్ని కాపాడుకోవడం కోసం గాడిదని తినమంటోంది అని ఊహించింది. అయినా అమాయకంగా 'అలాగే' అని తల ఊపింది.

వెంటనే నక్క వెనక్కి వెళ్ళి "నాతో రా...." అంటూ గాడిదను కొద్దిగా అవతలికి తీసుకెళ్ళి గుంటలో పడేట్లు చేసింది.

గాడిద గుంటలో పడీ పడక ముందే సింహం నక్క మీదికి దూకింది.

"గుంటలో ఉంది కాబట్టి కాస్త ఆలస్యమైనా గాడిద పారిపోలేదు. కానీ నువ్వు పారిపోతావ్" అంటూ నక్కని చీల్చి తన ఆకలిని తీర్చుకుంది సింహం.

మళ్ళీ ఆకలి వేసినపుడు తినవచ్చును లెమ్మని గాడిదను గుంటలోనే వదిలేసి వెళ్ళి పోయింది.

ఎవరు తీసుకున్న గోతిలో వాళ్ళే పడతారు! గాడిదను చంపాలనుకున్న తానే చచ్చింది!!

***

# ప్రగల్భాలు

అడవిలో పోతుంటే పిల్లికి నక్క ఎదురొచ్చింది. ఇద్దరూ ఒకరి కష్టసుఖాలు మరొకరికి చెప్పుకోసాగారు.

"మనశ్శాంతితో నిశ్చింతంగా గడిపే రోజే లేదు. ప్రతిరోజూ ఎవరు ఏ క్షణాన ప్రాణం తీసేస్తారోనని భయం భయంగా బ్రతకాల్సిందే జీవితాంతం" వాపోయింది పిల్లి.

"కాని నేనటువంటి భయానికి పొరబాటున కూడా నా జీవితంలో తావియ్యను. నువ్వు చెప్పినంత దుర్భరంగా జీవితం తయారైనా తప్పించుకోవటానికి నా దగ్గర వందల కొద్ది ఉపాయాలు ఉన్నాయి" గర్వంగా అంది నక్క.

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి. నాకు తప్పించుకోవడానికి తెలిసింది ఒక్కటే మార్గం - పారిపోవడం! ఒక వేళ అలా పారిపోలేక పోయానూ అంటే ప్రాణాలు కోల్పోవలసిందే!" బాధపడింది పిల్లి.



"ఎంతయినా నువ్వు నా మిత్రుడివి కదా! శత్రువుల చేతిలో నుండి తప్పించుకోడానికి కొన్ని ఉపాయాలను చెబుతాను విను..." గొంతు సవరించుకొని చెప్పబోయింది నక్క.

ఇంతలో ఓ వేటకుక్క హఠాత్తుగా వాటిమీదికి దూకింది.

పిల్లి తనకి తెల్సిన ఒకే ఒక్క ఉపాయాన్ని ఉపయోగించి చటుక్కున పక్కనున్న చెట్టు ఎక్కి కూర్చుంది.

తనకి తెలిసిన వందలకొద్దీ ఉపాయాల్లో ఒక్క ఉపాయాన్ని ఆలోచించుకోనివ్వకుండా చటుక్కున నక్క మెడ కొరికేసింది వేటకుక్క. మాకే తెలివి తేటలున్నాయని విర్రవీగడం ఎప్పుడూ మంచిది కాదు. ప్రగల్భాలు అసలు పలుకకూడదు!

***

# నిజం

ఒకసారి ఒక మేక పచ్చిక మేస్తుంటే హఠాత్తుగా ఓ పులి అక్కడికి వచ్చింది.

మేక కంగారుగా అటు ఇటు చూసింది. పారిపోవడానికి అసలు అవకాశమే లేదు.

చటుక్కున మేక మెదడులో ఓ ఆలోచన మెరిసింది.

"మనిద్దరి గురించి మూడు నిజాలు చెబుతాను. అవి నిజాలే అయితే నన్ను విడిచి పెట్టు. లేకపోతే తినేయ్" వినమ్రంగా అంది పులితో మేక. పులి అందుకు అంగీకరించింది.

"నువ్వు మిగతా పులుల్ని కలిసి నప్పుడు నేను దొరికితే విడిచి పెట్టానని చెబితే అవి చచ్చినా నమ్మవు. అవునా?" అడిగింది మేక. అవునన్నట్లుగా తలూపింది పులి.

"అలాగే నేను మిగతా మేకల్ని కలిసినపుడు పులి నన్ను పట్టుకుని చంపకుండా విడిచిపెట్టిందంటే నమ్మవు" రెండో నిజం చెప్పింది మేక.



"మరి మూడో నిజం ....... ?" పులి అడిగింది.

"మనిద్దరం కలిసిన తరువాత నువ్వు నన్ను చంపకుండా నాతో ఇంత సేపు ముచ్చటిస్తున్నావు అంటే నీకు ఆకలిగా లేదు. ఇది మూడో నిజం"

"నిజంగా నీవు చాలా తెలివి గల దానివి. అందుకే ఈసారి నిన్ను చంపకుండా విడిచి పెడుతున్నాను. మళ్ళీ కలుసుకున్నప్పుడు మాటలే ఉండవు. గుటుక్కున నిన్ను మింగేస్తాను. ఇది నేను చెప్పే నిజం గుర్తు పెట్టుకో" అంది పులి.

"నేను మరో నిజం చెబుతున్నాను. పొరబాటున కూడా మరోసారి నీకు చిక్కను తెలుసా ?" అంటూ తుర్రుమంది బుజ్జిమేక.

***

# సలహా

ఒక పిల్లి బాగా ముసలిదై పోయింది. ఎలుకల్ని వేటాడి పట్టుకునే ఓపిక దానికి లేకుండా పోయింది. దాంతో ఏవైనా జిత్తులతో ఎలుకల్ని పట్టుకోవాలని తెగ ఆలోచించసాగింది. ఆఖరికి దానికి ఒక ఆలోచన వచ్చింది. వెనుక కాళ్ళతో ఓ కర్రని పట్టుకుని కిందికి వ్రేళ్ళాడసాగింది.

అలా వేళ్ళాడుతుంటే అది చూసి ఏదో అనుకుని ఎలుకలు అటుగాపోతాయి, అప్పుడు వాటిని పట్టుకోవచ్చని దాని ఆలోచన. అది అనుకున్నట్లుగానే కొన్ని ఎలుకలు అటుగా వచ్చాయి.

ఏదో సంచీ వేలాడుతోందనుకున్నాయి. ఆ సంచీ చివర పిల్లి తల ఉండడం వాటికి ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఆ ఎలుకలలో ఓ ముసలి ఎలుక ఉంది. అది పిల్లుల వేషాల్ని ఎన్నిటినో చూసింది. అందుకే వెంటనే విషయాన్ని గ్రహించి ఎలుకలన్నింటినీ చాటుకు తీసుకెళ్ళి నిలబెట్టి చూస్తుండమని చెప్పి తను సర్రున కర్ర మీద నుండి పాక్కుంటూ పోయి పిల్లి వెనుక కాళ్ళని కొరికింది.

అంతే! పట్టు తప్పి కింద పడింది పిల్లి. పగలబడి నవ్వుతూ పక్కకి తప్పుకున్నాయి ఎలుకలు.

అందుకనే పెద్ద వాళ్ళ సలహాలను ఎప్పుడూ వింటూ ఉండాలి.



# తెలివి

చిరుత పులికి తన చర్మం అందంగా ఉంటుందనే గర్వం రోజురోజుకి పెరిగి పోసాగింది. పెద్దపులి కన్నా కూడా తాను గొప్ప దాన్నని గర్వించసాగింది.

చిన్న జంతువులన్నింటికీ దాని గర్వాన్ని భరించడం కన్నా మరో మార్గం లేకుండా పోయింది. నక్క మాత్రం చిరుతపులికి బుద్ధి చెప్పడానికి సమయం కోసం ఎదురు చూడసాగింది.

ఆ రోజు నక్కని నిలబెట్టి చిరుతపులి తన చర్మం అందం గురించి ప్రగల్భాలు పలకసాగింది. ఒకవేళ వెళ్ళిపోవడానికి ప్రయత్నిస్తే తన పంజాతో ఎక్కడ కొడుతుందో అనే భయంతో ఓపిగ్గా వినసాగింది నక్క.

ఎంత సేపటికి తన ప్రగల్భాల్ని ఆపడంలేదు చిరుత. చివరికి విసిగి "మానవుడు మనకన్నా బలహీనుడయినా మనకన్నా ఉన్నతంగా ఎందుకు జీవిస్తున్నాడనుకుంటున్నావ్!" అని అడిగింది నక్క.



"ఎందుకట?" అడిగింది చిరుత.

"అతనికి అందమైన శరీరం ఉండి కాదు. అంతకన్నా గొప్ప బుర్ర ఉంది!" అంది అక్కసుగా నక్క.

చిరుతపులికి విపరీతమైన కోపం వచ్చింది. ఆ విషయాన్ని గ్రహించిన నక్క ఆపకుండా చెప్పుకు పోసాగింది. "మంచి చర్మమున్న జంతువులు కనిపిస్తే మనిషి విడిచిపెట్టడు. అందుకే నాకు మిమ్మల్ని చూస్తుంటే బాధ వేస్తోంది. " అంటూ "అదుగో మనిషి వస్తున్నాడు" అంది మరి కొంచెం బిగ్గరగా నక్క.

అంతే! మరుక్షణంలో చిరుత అక్కడ నుండి మాయమైపోయింది. తెలివిగా దాని పీడని వదిలించుకున్న నక్క 'బతుకు జీవుడా' అనుకుంటూ వెనుదిరిగింది.

***